# సమాలోచనము

—(O)—

శ్రీమద్రామాయణము మహాకావ్యము. ఆదికవియగు వాల్మీకి మహర్షి ప్రణీతము. ఆదికావ్యమని దీనికిఁ బేరు. "ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్" అనునదియే దీని మహిమము. ఈ గ్రంథము శతకోటి ప్రవిస్తరము. భూలోకమున నియ్యది చతుర్వింశతి సహస్ర గ్రంథముగాఁ బ్రకాశితము. గీర్వాణ వాణి నియ్యది విరాజితము. పురుషార్థ చతుష్టయప్రదము. సకల ప్రపంచముల నీ గ్రంథము వ్యాప్తమైనట్లు శ్రుతిస్మృతిప్రసిద్ధము.

ఈ మహామహిమోపేతమగు శ్రీమద్రామాయణమును దేశమునఁగల సకల భాషలయందును బూర్వులగు మహాకవులు అనువదించి గీర్వాణభాష తెలియనివారి కనువుగ నుండునట్లు కావించిరి. ప్రకృతము కావించుచున్నారు. కావింతురు. "ఎందఱెన్ని గతులఁ వర్ణించినఁ గ్రాలదే" యన్నట్లు సంగ్రహముగఁ గొందఱు, యథామూలముగఁ గొందఱు, వచనరూపమునఁ గొందఱు, పద్యరూపమునఁ గొందఱు, నాటకరూపమునఁ గొందఱు, యక్షగాన రూపమునఁ గొందఱు, పదముల (జంగము కథా) రూపమునఁ గొందఱు నీ మహాకావ్యమును బ్రపంచమునఁగల యన్ని భాషలలోనికి మార్చి జన్మము ధన్యతమముం గావించియున్నారు.

తెలుఁగు బాసయందు జనులకు సుసులభముగ నవగతము కావలయునని రంగ నాథుఁడను కవి ద్విపదరూపమున రచించెను. ద్విపదకావ్యమునకుఁ గల పలుచఁదనమును దన కావ్యనిర్మాణమునఁ దొలఁగించెను. అతని సమకాలికుఁడగు భాస్కరుఁడు మొదలగు కవులు పద్యకావ్యముగ రచించిరి. తర్వాత ఉభయకవి మిత్త్రుఁడును, కవిబ్రహ్మయును నగు తిక్కన సోమయాజి నిర్వచనోత్తరరామాయణ మను పేర రంగనాథ భాస్కరాదులు తెలిఁగింపని యుత్తరకాండము తెలిఁగించెను. ఇటీవలఁ దెలుఁగు పద్యకావ్యములుగా మూలానుసరణముగా శ్రీ గోపీనాథము వేంకట కవిగారును, శ్రీ వావిలికొలను సుబ్బరాయ కవిగారును, శ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మగారును, శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారును వ్రాసిరి. వీరిలో యథామూలముగఁ దెలిఁగించినవారు కొందఱు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కవిగారును తెలిఁగించినారని యిటీవల వినవచ్చుచున్నది. ఇంక నీ మహాకావ్యమును సంగ్రహముగ అయ్యలరాజు రామభద్ర కవియు, కుమ్మర మొల్లమ్మయు, కూచిమంచి తిమ్మకవి మొదలగువారు కావ్యఫక్కిలో పస్తుభేదము గనఁబడనిమాట్లు నడపిరి.

రంగనాథుఁడు ఈ ద్విపదకావ్యమును రచించెనని తెల్పితి. ఈ విషయమున వాదోపవాదములు విరివిగా సాగుచున్నవి. ఇవి తుదకుఁ బొడవుచేతుల పందేరమను నట్లు వ్యక్తిత్వాభిమానమును బట్టి, మొగమోటమునుబట్టి వ్యాప్తిఁ బడుచున్నవి. కాని యిదమిత్థమ్మని నిర్వచించువారు కనంబడరు. తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లను నట్లుగ నధికారప్రాబల్యమువలనఁ దమ వాదమే నిర్వివాదమనుటను ప్రతిష్ఠించుచున్నారు. ఇట్టి విమర్శకాగ్రేసరులు చారిత్రిక పరిశోధకులు నందందు మిక్కుటముగ నాశ్రయించి పదవినిగాంచి యా పదవియందుఁ దమకు నెదురులే రను స్థిర బుద్ధితో లోకమును నపమార్గముఁ ద్రొక్కించి "ఘటం భింద్యాత్పటం ఛింద్యా త్కుర్యాద్వా గార్దభస్వరమ్, యేనకేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవే" త్తనునట్లు తార్కాణగావించుచున్నారు. ఇది పలుకుబడి గడుసుఁదనమేగాని తాత్త్వికశక్తి యుక్తము గాదు. ఇట్టి చారిత్రిక శోధకులు కవులను ఈ మూలనుండి యామూలకు, నీ గ్రామము నుండి యా గ్రామమునకు, నీ పట్టణమునుండి యా పట్టణమునకు బంతుఁబోలె నెగఁజిమ్ముచున్నారు. పాపము! కీర్తికాయులైన వారి యాత్మలు వీరి యస్తవ్యస్త కృత్యమునకు నెంతెంత యుమ్మలించుచున్నవో? బ్రదికియే యుండిన నింతటి ధీరత్వ మీ విమర్శకుల కుండఁ గల్గునా? దొరతనము ఈ విషయమున నూరకుండునా? ప్రాభవమునఁ గావించు నీ వ్రాతలను లోకము సమాదరింపక యుండుట లగ్గు.

రంగనాథుఁడు రామాయణమును తాను రచించినట్లు గ్రంథమున నెందును దెల్పలేదు. లోకమునఁ బేరు వ్యాపింపవలయునన్న నిర్హేతుకముగఁ గాఁజాలదు. ఇంచుకయైన నిదానముండవలయును. గ్రామములకు, దేశములకు, ఇండ్లకు, గ్రంథములకు నామధేయములు వాస్తవతనుబట్టి యుండుట లోక ప్రసిద్ధము. మాఘము శిశుపాలవధమున కేల? కిరాతార్జునీయమునకు భారవియననేల? మలహాపాలీయమును పే రెట్లు వచ్చినది? ఆనంద రంగరాట్ఛంద మని యేల యనవలయు? ఇట్లే ఈ కృతియు ద్విపదరామాయణ మనరాదా? రంగనాథ రామాయణమని యననేల? ఇందలి యవతారికయందలి "భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ-రామాయణంబు పురాణ మార్గమున విరచింపు" మని చెప్పుటయు, "మాతండ్రి విఠలక్ష్మానాథుపేర........ శ్రీరామచరిత మొప్పఁజెప్పెద" నని బుద్ధరాజు చెప్పుటయు రామాయణ రచనకుఁ గారణముగా వచియింతురు. కాండాంతములయందును, "తమ తండ్రి విఠ్ఠల ధరణీశు పేర........చెలువొందు రామాయణంబు" అని యున్నది. ఈ విషయమునుబట్టి చూడఁగాఁ బండితకవు లాత్మస్తుతి చేసికొనుట యాచారములేదు. కావున బుద్ధరాజు తన్ను దాను నుతించికొనియుండునాయని యనుమానము కలుగక మానదు. కాని యీ సందర్భమున మల్లినాథుఁడు, ఆదికవి యగు నన్నయభటు, అల్లసాని పెద్దన మున్నగువారు తమ గ్రంథములలో నిట్లే తమ్ముతాము నుతించుకొని యున్నారని

వచ్చును గాని, యీ నుతికిని దీనికిని గల భేదము విద్వద్వరు లెఱింగియే యున్నారు.

ఉత్తరరామాయణ భాగమును బుద్ధరాజు పుత్త్రులగు కాచభూవిభుఁడు, విఠల భూపతి యనువారు తమ తండ్రియగు బుద్ధ భూపతి యాజ్ఞానుసారముగ ద్విపద కావ్యముగనే వ్రాసిన ట్లుండుటయు గోనబుద్ధరాజే యీ గ్రంథకర్త యగుటకుఁ గారణ మని కొందఱందురు.

బుద్ధరాజు తాను రామాయణమును రచించి తన కుమారులను బిలిపించి "నాయనలారా! నేను రామాయణమును రచించితిని. మీరు నా కుమారులు. నా కీర్తి వర్ధనులు. మీరు నిపుణులై రామాయణమును జెప్పఁ దనుటయుఁ, గుమారులు మా తండ్రి ప్రతిన చెల్లింపఁ గనుట పరమధర్మంబనియు, వాల్మీకి చెప్పినజాడ తండ్రి పేరఁ జెప్పినట్లు ఉత్తర రామాయణావతారిక యందును, గాండాంతమునను గలదు.

ఈ విషయగ్రథనము వింతగఁ గన్పట్టుచున్నది. తత్త్వదర్శకుల కియ్యది సంశయాస్పద మగుటయేగాక యిది యసంభవమనియుఁ దోఁపకమానదు.

పర్యాలోచన మొనర్పఁగా గ్రంథకర్తృత్వ విషయమున నాధునికులగు సూక్ష్మదర్శులకంటెను ప్రాచీనులగు దీర్ఘదర్శుల యూహలే సమంజస మని తోఁచగలదు. ఇతిహాసము లూరక పుట్టవు. కోనబుద్ధరాజు పదుమూఁడవ శతాబ్ది వాఁడగుట చారిత్రకారుల మతము. ఆ కాలముననే రంగనాథుఁడను ప్రసిద్ధ కవియు రాజు నాస్థానమున నుండిన వాఁడనుట స్పష్టము. రాజుగారి వాంఛ ననుసరించి ద్విపదకావ్య మగురామాయణమును రంగనాథుఁడు రచించి యాశ్రితుఁడగుట రాజుపేర వెలయించెను. అట్లే వారి పుత్త్రులకీర్తిని వెలయింపఁదలఁచి యుత్తరకాండమును రచించి పుత్త్రులపేర నంటఁగట్టెనేకాని బుద్ధరాజుగాని, తత్పుత్త్రులుగాని యీ కావ్యరచన గావించినట్లు గన్పట్ట దనుట నిస్సంశయము. తా నున్నస్థలమునకుఁ గీర్తిప్రతిష్ఠల నాపాదించుట విజ్ఞుల లక్షణ మగుట నిట్టి యుత్కృష్ట కావ్యరచనచే స్వాశ్రయ పోషణము గావించి నాఁడని చెప్పుటలో నే మాత్రము లోపములేదు. ఎవరి యూహలు వారు తెల్పుటలో నే వారి కేమి బాధకము గలదు? తండ్రివ్రాసిన గ్రంథము రంగనాథ నామాంకితముగా గ్రంథము వెలయుటకుఁ గారణము కుమారు లించుకయైనఁ దెలుపకయుండుట యేల? రంగనాథుఁడు తన పేరైనను, గులగోత్రము లైనను దెలుపలే దనుటలోఁ దనకుఁ బోషకులుగా నుండువారిని గొనియాడుట యుత్తమ ధర్మమని ధన్యత్వమొందుట తగిన కారణమనుటలో నేలోపము లేదు. బుద్ధరాజ పుత్త్రద్వయమే యుత్తరకాండము వ్రాసియున్న సంపూర్ణముగఁ బూర్వరామాయణమున కాపేరు (రంగనాథ రామాయణము అనుట) కలుగుటకుఁ గారణము పచియించి యుండకపోరు. తమ గుణములు తండ్రిగుణములు, తమ ప్రతిభలు, తండ్రి ప్రతిభలు చెప్పుటలో నింత విశృంఖలత నవలంబించియుండుట పొసఁగదు. ఆశ్రితుఁడగు రంగనాథుఁడు కావించిన యీ యవ

*

తారికలోని నుత్యాదికము, కొండాంతముననుండు స్తుత్యాదికము యుక్తియుక్తముగ నున్న దని చెప్పవచ్చును. గోనబుద్ధారెడ్డిపేరను, తత్పుత్రులపేరను రంగనాథుఁడు రామాయణము నంతను వ్రాసియే యుండినఁ "బూర్వభాగము మాత్రము ఎక్కువ వ్యాప్తిఁ లోనికివచ్చి యుత్తర భాగ మేల వ్యాప్తిలోనికి రాక నిలిచిన"దని ప్రశ్నింపవచ్చును గాని, శ్రీ మద్రామాయణములోనే యుత్తరకాండము పురాణము చెప్పుటకును, పారాయణ మునకును ననువుకాని దగుటయు నందు విశేషించి సీతావియోగాదిక ముండుట మన స్సున కెక్కువ యాకులత గల్గించుననుటయు, నివర్శనములు కాఁబట్టి, లోకమున రంగ నాథ రామాయణము పట్టాభిషేకమువఱకుఁ గల కథాభాగము ప్రశస్తి కెక్కినది. ఉత్తరకాండభాగము పలువురు వ్రాసికొనక వదలిరి. ఆ కారణముననే ఉత్తరకాండ గల పుస్తకములు (తాళపత్రగ్రంథములు) ఆఱు కాండలుగల గ్రంథములసంఖ్య కంటె నల్పమగుటకు హేతువని యెల్లవా రంగీకరింతు రనుట నిస్సంశయము. మొత్తము మీఁద ద్విపద రామాయణము రంగనాథుఁడు రచించి తనపేర గ్రంథము వెలయుట కును, రచన గోనబుద్ధరాజు తత్పుత్రులు చేసినట్లు వ్రాయుటకును ఏర్పాటు చేసికొని యుండునేకాని వేఱుకాదు. లేకయున్న బుద్ధరాజు సంస్థానాధిపతిగా నుండి తత్పుత్రులు కొండంతవాని పుత్రులుగనుండి బుద్ధరాజు రామాయణ మనివ్యాప్తినొందింపక రంగనాథ రామాయణ మని వ్యాప్తిచేయుటలోఁ దమ ప్రాశస్త్యమునకు లోపము కల్పించుకొం దురా? తన వస్తువు నితరుని దని యుత్తమత్వముగల దాని నీనఁగాచి నక్కలపాలు చేయు నల్లెవ్వఁడేని చేయునా? రంగనాథుఁ డన్ననో తనకుఁ బాలకులును, నన్న వస్త్రము లిచ్చి పోషించువా రగుట తన కృతిని వారు వ్రాసిరని వారిపేర వ్రాసెను. ఇది సమంజసమే. ఉప్పు పప్పు తిన్న దోష మింత చేసెను. కృతజ్ఞుని ధర్మముగదా యిది. రంగనాథుఁడే యీ రామాయణ కర్త యను నా భావము నెల్లరు నామోదింతురుగాక: ఈ వ్రాఁత ప్రాభవమని యెంచరాదు. ఇది తగిన యూహ.

ఈ విషయమయి వీరేశలింగము పంతులుగారు "ఒకవేళ రంగనాథుఁడే యాఱు వేల నియోగియై యుండవచ్చును. ఆఱువేల నియోగియైన కోవెల గోపరాజు రంగ నాథుని నియోగి కవులలోఁజేర్చి యీ క్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు.

అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి పెద్దిరా
జును, బిన వీర రాజుఁ, గవి సోమునిఁ, ధిక్కన సోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజు సో
మన, నమరేశ్వరుం, దలఁతు మత్కుల చంద్రుల సత్కవీంద్రులన్." అని,

వ్రాసిరి. కాఁబట్టి రంగనాథుఁడను కవీంద్రుఁడే లేఁడను వారి మాట కేమందురో?

సమకాలికులును నేఁటికి వందవత్సరములు ముందుండువారును నగు మహా కవులు రంగనాథుని ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడని రంగనాథ రామాయణము రచించి

నాడని నుతియించిన పద్యములన్నియు నాంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందు నిం తకుముందే ప్రకటించి యున్నాఁడను. జాతిభేదములు పాటింపక గుణ గ్రహణ పారీణ తనే పాటించు నాకాలమున నిందఱు మహాకవులు ఇట్లు పొగడుటకుఁ గారణమేమి యని యాలోచించిన బుద్ధిమంతులు గ్రహింపఁగలరు. "అసతి కుడ్యే చిత్రలేఖన" మన్నట్లు ఇంతమంది మహాకవులు పొఱఁబడరని రంగనాథ మహాకవి ద్విపదకావ్య మున భారతకవుల ప్రఖ్యాతిని గోరి రచించెనని గ్రహించుట బుద్ధి మల్లక్షణము.

ఇప్పటికిని నా ముక్తమాల్యద పెద్దన ప్రణీతమనువాదము నెగడుచున్నది గదా? కావుననిది రంగనాథ ప్రణీతమనుట నిస్సంశయము. పట్టుఁబట్టి యిపుడు బుద్ధారెడ్డివ్రాసె నని పాఠ్యగ్రంథములలోను, విద్యార్థులు చదువు టిప్పణముల (Notes) లోను బల వంతముతోఁ జొప్పించి సినిమా ప్రదర్శనములవలన భాషకును, గథా సంవిధాన ములఁ బురాణములకును విభేదము పుట్టించి నీతిని, జాతిని, తెలుఁగుభాషకుఁగల కీర్తిని మంటఁ గలుపుచున్నట్లే యిప్పటి చారిత్రక పరిశోధకులగు పదవీ సిద్ధులు చేయు యత్నములని యెంచుట విజ్ఞుల లక్షణము,

ఈ గ్రంథము మొదటి ప్రతాపరుద్రుని కాలములో రచియింపఁ బడినదని తెల్పు దురు. ఈ ప్రతాపరుద్రుఁడు 1200 వత్సరప్రాంతమున రాజ్యముచేసినవాఁడు. గోన బుద్ధారెడ్డి దూపాడు పరగణా కధిపతిగా నుండిన సామంత రా జందురు. బుద్ధారెడ్డి కూఁతురు కుప్పమాంబ. బూదపూరిలో శా॥ ౧౧౯౪కి సరియగు 1286 ధాతృవత్సర మున లింగప్రతిష్ఠచేసి యనేక భూదానములు చేసినట్లు శాసనములు గలవు.

"శ్రీ గోనవంశనిజశేఖర బుద్ధయాఖ్య, పుత్రీ పవిత్రచరితా భరితా గుణౌఘైః,
శృంగారసార కరణీః కరణీయ దక్షా,కుప్పాంబికాఽజనిచ తస్యసతీ కళత్రమ్"

అను శ్లోకమునఁ గుప్పాంబ బుద్ధరాజు కూఁతురగుట స్పష్టమగుచున్నది. రంగనాథరామాయణ రచన కాలమున కీమె పుట్టెనో లేదో యనియుఁ బదు మూఁడవ శతాబ్దియందే ఈ రామాయణము రచింపఁబడినదనియు శ్రీ వీరేశలింగము పంతులు గారి మతము. ఇది నిక్కమే యగును. ఇట్టి ప్రథితయశుల కృతిమాత్రము పుత్రులేల విశదీకరింపరు? ఇది రంగనాథకవి కృతియేగాని యితర కృతముకాదు.

## కవిత్వము – చమత్కృతి

ఆబాలగోపాలమున కందుబాటులో నుండునట్లును, వినిన యంతనే యర్థావ బోధమగుటకును దగినది ద్విపదకావ్యము. హరిశ్చంద్ర, నల, రాజయోగసార, పరమ యోగి విలాసములు, మున్నగునవి యెంతయు సరళముగనుండి గ్రహించుటకు నను వుగనుండుట యంద ఱెఱింగిన విషయమే. దీనికే దేశికవిత యందురు, కొందఱీదేశి కవిత పశ్చిమాంధ్రుల కంటఁగట్టిరి, మంచిదే. హృదయంగమముగ నెల్లరయుల్లములు పల్లవింపఁజేయు నిట్టి కవిత యెంతయు సన్నుతి కెక్కును. పశ్చిమాంధ్రమని దేశమును బిలుచుటలో నంత సామంజస్య మగుపడదు. దత్తమండలములవారి నిట్టి పరిభాషకు గుఱిచేయుట యుచితముగాదు. త్రిలింగదేశమువా రనవచ్చును. తెలుఁగువా రన

వచ్చును. క్రమక్రమముగ నిపుడు రాయలసీమవా రనవచ్చును. ఈ సీమలోఁగల గ్రంథములు, కవులు, దేశమునం దంతటను సంస్మరింపఁదగిన యాదృతిని గడించిన వా రనుటలో నతిశయోక్తిలేదు. ఇం దుత్పత్తియగు వస్తువులఁ గాపట్యములేదు. వీనికి సహజప్రభ గలదు. మెఱుగు లనవసరము.

కవి యిప్పటి కించుమించుగ నేడువందల వత్సరములక్రిందటివాఁడే యయి నను, బద్యకావ్యము తెరువునకుఁ బోక, ద్విపద కావ్యముగనే గ్రంథమును సాగించి నవరసభరితముగ వెలయించుటలో నీ మహానుభావుని ప్రతిభ యప్రతిమ మని చెప్పవల యును. సంస్కృతాంధ్రముల నసమాన పాండితీవిరాజితుఁడనుట యతిశయోక్తికాఁ జాలదు. గ్రంథమును జదువువారలే యీ విషయమును నిర్ణయింపఁగలరు. అగసాలి కమ్మి యచ్చునఁ దీసిన బంగరు కమ్మివలె నెగుడుదిగుడులు లేక సరళముగ స్నిగ్ధగుణము గలిగి యతిశయ ప్రభతో రచన యున్నదని ముమ్మాటికిఁ జెప్పవలయును.

ప్రామాణికులగు కవుల పంక్తిలో నొక్కఁడీ రంగనాథుఁ డనుటకు లాక్షణికు లగు అప్పకవి మొదలగువారు తమ లక్షణ గ్రంథములలో నుదాహృతములగు గ్రంథ భాగములే చెప్పుచున్నవి. అందందు దుష్టసంధులు, వ్యాకృతికి లొంగని ప్రయోగములు కనఁబడుచున్నవి. రేఫశకటరేఫ మైత్రి యీ మహనీయున కభిమతమా యని తలంప వలసిన చోట్లు కలవు. ఒక్కొక్కచోట బమ్మెరపోతన యితని ననుసరించెనాయని యనవలసిన భాగములును గలవు.

ఇందు గ్రంథాదినుండి—"ఆదినారాయణు నఖిలలోకేశు, భావించి కీర్తించి ప్రార్థించి సేవించి, యభిమత సిద్ధిగావింప"—అనువఱకుఁగల ధ్యానయోగమును జదివి నచో నీ గ్రంథకర్తకుఁగల యోగాభ్యాస విధానము సద్గురు కృపాజనిత సత్పద్ధతి యెంతయు విశదము కాఁగలదు. ఇందు యోగశాస్త్ర సారమంతయు నిమిడియున్న దనవలయు. గొప్ప భక్తుఁడనియు, యోగియనియు నీతనిఁ గీర్తింపవలయు. లేక యున్న నింతటి గ్రంథమును ద్విపదగా రచించి జనరంజన మొనరించుట కనువు పడునా? ఇష్టదేవతాస్తుతిలో శారదను, వాల్మీకిని, వ్యాసమహర్షిని, శుకబ్రహ్మను మాత్రమే వినుతిచేసినాఁడు. పూర్వకవులనుగాని, తత్కాలమందలి కవులనుగాని పేర్కొనలేదు. ఎవరిని బేర్కొనిన నేమి తనపేరు తెలియునోయని తలంచెనో? ఆత్మజ్ఞాని యగుట తన పేరు ప్రకటించుకొనుట తగ దనుకొనెనో? తన ప్రభువుల యెడ నపచారము చేసినట్లుగా నెంచెనో? ఇదియును గాక మీఁదు మిక్కిలి తనకుఁగల ప్రభుభక్తిని బూర్ణముగా వెలయించి ధన్యుఁడైనాఁడు.

అందందు వర్ణనలు యుక్తియుక్తముగ హృదయంగమముగ ఔచిత్యముగ నున్నవి. వీని నన్నింటిని బ్రత్యేకించి యిందుదాహరింప గ్రంథ విస్తరభీతి మానితిని.

పాఠకులే చదివి యానందింతురని మనవి. కవి "అసమాన లలిత శబ్దార్థ సంగతుల.... భావనల్నిండ" నని తాను బూనినరీతిని గ్రంథరచన సంపూర్ణముగఁ జేసి కృతకృత్యుఁడై నాఁడు.

గ్రంథకర్త యింతటి యుత్కృష్ట గ్రంథమును ద్విపద కావ్యమునఁ బ్రథమ శ్రేణి నాశ్రయింపఁ దగినదానిని రచించి, తన కులగోత్రములను, స్థలాదికమును దెలుపక పోవుట తనకుఁగల ప్రభుభక్తియే ప్రధానకారణమని మాటిమాటికిఁ దలంపఁ దగును. ఈ గ్రంథము పట్టణములమాట యటుండఁ, గోడిగూసిన ప్రతి గ్రామమునందును గల దనుటకును, బురాణ కాలక్షేపముగ నిదియే యాదృతిపాత్రమైన దనుటకును, బొమ్మలాట లాడువారును నిందలి కథాభాగములనే శ్రావ్యముగఁ బాడుచు నభినయించి ప్రేక్షకుల నానందరస సాగర నిమగ్నులఁ గానించుచున్నారనుటకును, నీగ్రంథమునకుఁగల మహిమ నిరుపమాన మని వేఱ చెప్పవలయునా ?

కవి యిందు శ్రీ మద్రామాయణమునలేని, జంబుమాలి వృత్తాంతము, కాలనేమి కథ, సులోచనా చరిత్రము చదువ చదువఁ బాఠకులకు, శ్రోతలకుఁ బరవశత్వమును గలిగించుచున్న వనుటలో వింతలేదు. ఇం దాభాగ మని యీభాగ మని చెప్పఁబనిలేక సర్వత్ర హృద్యముగ నున్నది.

ఈ గ్రంథమును సరిచూచి (ప్రాఁతతప్పుల పుస్తకమును దిద్ది) యొక పీఠిక వ్రాసి యిమ్మని కడప రాయలు అండుకో వారు కోరఁగా నశక్తుఁడనయ్యు, నిజమాడిన నిష్ఠురము ప్రాప్తించు నని యెఱిఁగియు, నాకుఁ దోఁచిన భావములను నిశ్శంకముగా వ్రాసి యిచ్చితి. తప్పులు పండితులు మన్నింపుఁడు. గ్రంథ విషయమున నెక్కుడుగ వ్రాయవలసిన యంశము లుండియుఁ బ్రకృతము నియమితుఁడనై విరమించితి. రాఁబోవు ముద్రణమున మరలఁ గొంత యవకాశమునుబట్టి విన్నవింతు. భాషాసేవకై పూనిన యీ రాయలు అండ్ కో వారి యుద్యమమునకుఁ దోడ్పాటుచూపుట తెలుఁగు దేశమువారి సత్కృతి. వీరికిని, బాఠకులకును శ్రీ రామచంద్రుఁ డాయురారోగ్య భాగ్యములఁ జేకూర్చుఁగాక !

వశంవదుఁడు

శ్రీ లలితా విలాసము
విరోధి వత్సరాది.

కావ్యపురాణతీర్థ, విద్వాన్,
జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ
శ్రీ శ్రీ శ్రీ

# విషయసూచిక.

—(O)—

—: బాలకాండము :—


| విషయము. | పుట. |
|---|---|
| దేవతాస్తుత్యాదికము | 1 |
| గ్రంథరచనకుఁ గారణము | 2 |
| కథాప్రారంభము | 5 |
| కుశలవులు శ్రీమద్రామాయణ కథనుగానము చేయుట | 9 |
| మంత్రులతోఁ దశరథుఁడు బుత్త్రకామేష్టి సేయుట కాలోచించుట | 10 |
| ఋశ్యశృంగవృత్తాంతము | 11 |
| ఋశ్యశృంగుండు వారాంగనలఁ దగిలి రోమపాదునియింటికి వచ్చుట | 13 |
| దశరథుఁడు యాగదీక్ష వహించుట | 15 |
| దేవతలు బ్రహ్మకడకరిగి రావణుబాధలఁ దెల్పుట | 16 |
| దేవతలు విష్ణుఁవును నుతించుట | 17 |
| దశరథునకు యజ్ఞపురుషుఁడు దివ్యపాయస మొసఁగుట | 17 |
| బ్రహ్మ దేవతలను వానరులఁగాఁ బుట్టుఁడనుట | 18 |
| శ్రీరామాదుల జననము | 19 |
| శ్రీరామాదుల బాల్యము | 20 |
| విశ్వామిత్రుఁడు దశరథుని కడకు వచ్చుట | 21 |
| కౌశికుఁడు యజ్ఞ రక్షణార్థమై దశరథునితో రామునిఁ బంపుమనుట | 21 |
| వసిష్ఠముని దశరథునితో రామలక్ష్మణులఁ బంపుమనుట | 23 |
| కౌశికునితోడ రామలక్ష్మణులఁ బంపుట | 23 |
| అంగదేశవృత్తాంతము | 24 |
| విశ్వామిత్రుఁడు రామునకుఁ దాటకివృత్తాంతము దెలుపుట | 26 |
| తాటక వధ | 26 |
| శ్రీరామునకు విశ్వామిత్రుడు భృశాశ్వసంతానము లైన యస్త్రశస్త్రముల నిచ్చుట | 27 |
| శ్రీరాములకుఁ గౌశికుఁడు సిద్ధాశ్రమవిషయ మెఱింగించుట | 29 |
| విశ్వామిత్రుఁడు యజ్ఞము చేయుట | 30 |
| రాముని మిథిలానగరమునకుఁ బోవ మునులు ప్రేరేపించుట | 32 |
| కౌశాంబి వృత్తాంతము | 32 |

| విషయము | పుట. |
|---|---|
| విశ్వామిత్రుఁడు తనవంశక్రమంబు దెలుపుట | 33 |
| కౌశికుఁడు కుమారస్వామిజన్మము శ్రీరామునకు దెల్పుట | 35 |
| గంగానదీవృత్తాంతము | 37 |
| శ్రీరాముఁడు సగరులవృత్తాంతము దెల్పు మనుట | 38 |
| అంశుమంతుఁడు అధ్వరాశ్వముఁ దెచ్చుట | 40 |
| గంగావతరణ కథ | 41 |
| భగీరథుఁడు గంగను దెచ్చుట | 42 |
| అమృతోత్పత్తి | 45 |
| సుమతి యనురాజు విశ్వామిత్రు నెదుర్కొనుట | 48 |
| సుమతికి శ్రీరామలక్ష్మణులను గూర్చి కౌశికుఁడు తెల్పుట | 48 |
| గౌతమాశ్రమముఁ జేరుట | 49 |
| గౌతముఁ డహల్యకు శాపమిచ్చుట | 49 |
| శ్రీరామ లక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిలఁజేరుట | 50 |
| శతానందుఁడు విశ్వామిత్రప్రభావంబు దెల్పుట | 51 |
| విశ్వామిత్రుఁడు వసిష్ఠుని కామధేనువుఁ గొంపోఁజూచుట | 53 |
| కౌశికుఁడు ఈశ్వరునిచేత నస్త్రాదులు వడసి వసిష్ఠునితోఁ బోరుట | 54 |
| విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షిపదంబునకై తపంబుచేయుట | 54 |
| త్రిశంకునికై కౌశికుఁడు యజ్ఞంబు చేయ నారంభించుట | 56 |
| అంబరీషుఁడు యజ్ఞపశువుగా శునశ్శేపునిఁ గొనిపోవుట | 58 |
| విశ్వామిత్రుఁడు మేనకను గూడుట | 59 |
| జనకుండు శివునిచాప మెఱింగించుట | 61 |
| శ్రీరాముఁడు శివునివిల్లును విఱుచుట | 64 |
| దశరథుఁడు మిథిలకుఁ బోవుట | 65 |
| ఊర్మిళాదుల వివాహయత్నము | 67 |
| దశరథుని వంశక్రమము | 67 |
| వసిష్ఠుఁడు యువనాశ్వునివృత్తాంతముఁ దెల్పుట | 68 |
| శతానందుఁడు జనకు వంశక్రమంబు దెల్పుట | 70 |
| పురాలంకారము | 71 |
| దాశరథుల నలంకరించుట | 72 |
| శ్రీసీతారామకల్యాణము | 74 |
| పరశురాముఁడు శ్రీరాము నెదుర్కొని భంగపడుట | 76 |
| దశరథుఁడు పుత్రులం దోడ్కొని అయోధ్యకేగుట | 80 |

## —: అయోధ్యాకాండము :—


| విషయము. | పుట. |
|---|---|
| దశరథుఁడు ప్రజలతో దనకోర్కెఁ దెల్పుట - - - | 83 |
| దశరథుఁడు వసిష్ఠాదులతో రామునకుఁ బట్టముఁ గట్ట నాలోచించుట - | 83 |
| దశరథుఁడు శ్రీరాముని రాజ్యపాలనముఁ బూనుమని చెప్పుట - | 85 |
| మంథర కైకకు దుర్బోధచేయుట - - - | 86 |
| దశరథుఁడు కైకయింటి కరుగుట - - - | 89 |
| కైక దశరథుని వరముల నడుగుట - - - | 90 |
| కైకయింటికి సుమంతుఁడు దశరథుని బిల్వఁ బోవుట - - | 93 |
| శ్రీరాములు కైకయింటిలో నున్న దశరథునిఁ జూచుట - - | 94 |
| కౌసల్య శ్రీరాముని యరణ్యవాసమునకై శోకించుట - - | 96 |
| లక్ష్మణుని కోపము-రాముని యోదార్పు - - - | 97 |
| శ్రీరాములు కౌసల్య నూరార్చుట - - - | 98 |
| శ్రీరాముడు సీతతో తన యభిషేకభంగ మెఱిఁగించుట - - | 100 |
| సీత రాకకు శ్రీరాములు సమ్మతించుట - - - | 102 |
| శ్రీరాములు త్రిజటాఖ్యునకు గోవుల నిచ్చుట - - - | 104 |
| శ్రీరాములు సీతాలక్ష్మణసమేతుఁడై దశరథునివద్దకు వచ్చుట - | 105 |
| వసిష్ఠుఁడు కైకతోఁగఠినోక్తు లాడుట - - - | 108 |
| కౌసల్య సీతకు పతిధర్మముఁ దెల్పుట - - - | 110 |
| దశరథుఁడు రథము నిల్పుమని సుమంతునిఁ బిలుచుట - - | 112 |
| శ్రీరాములు గుహునిఁ జూచుట - - - - | 114 |
| సుమంతుఁడు అయోధ్య చేరుట - - - - | 116 |
| దశరథుఁడు కౌసల్యకుఁ దనశాపవృత్తాంతము దెల్పుట - - | 119 |
| దశరథుఁడు యజ్ఞదత్తునిజూచి చింతించుట - - - | 120 |
| దశరథుఁడు ప్రాణముల విడుచుట - - - - | 123 |
| భరతుఁ డయోధ్యఁ బ్రవేశించుట - - - - | 125 |
| భరతుఁడు కౌసల్యయొద్దకుఁ బోవుట - - - | 126 |
| భరతుఁడు రామునియొద్దకుఁ బోవుట - - - | 128 |
| భరతుఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరుట - - - | 130 |
| భరతుఁడు మునివేషధారులైన రామలక్ష్మణులఁ జూచుట - - | 133 |
| దశరథునిమృతిని భరతుఁడు తెల్పుట - - - | 134 |
| జాబాలి యనుముని శ్రీరామునకు హిత ముపదేశించుట - - | 137 |

—: అరణ్యకాండము :—

| విషయము. | పుట. |
|---|---|
| శ్రీరాముఁడు దండకారణ్యమునకుఁ బోవుట - - - | 141 |
| శ్రీరాముఁడు శరభంగాశ్రమంబుఁ జేరుట - - - | 142 |
| శ్రీరాముఁడు సుతీక్ష్ణమునిని దర్శించుట - - - | 143 |
| సీత శ్రీరామునిఁ బ్రశ్నించుట - - - - | 144 |
| మందకర్ణి వృత్తాంతము - - - - | 144 |
| అగస్త్యులఁ గాంచుట - - - - | 145 |
| అగస్త్యముని మహిమ - - - - | 146 |
| గోదావరీ తీరమున శ్రీరాముఁడు నివసించుట-జటాయువుతో మైత్రి - | 147 |
| హేమంతవర్ణనము - - - - | 147 |
| సౌమిత్రి ఖడ్గముఁ గొనుట - - - - | 148 |
| మునులు జంబునితపఃప్రభావంబుఁ దెల్పుట - - - | 150 |
| శూర్పణఖ కుమారుని గూర్చి శోకించుట - - - | 151 |
| శూర్పణఖ రామునిఁ జూచి మోహించుట - - - | 152 |
| ఖరుఁడు తన సేనలఁ శ్రీరామలక్ష్మణుల పైకి బంపుట - - | 154 |
| ఖరునిసేనలు రాము నెదుర్కొనుట - - - | 157 |
| శ్రీరామునితో ఖరదూషణులు యుద్ధము చేయుట - - | 158 |
| ఖరుఁడు శ్రీరాముల నెదుర్చుట - - - | 160 |
| శూర్పణఖ రావణునితోఁ దనభంగపాటును జెప్పుట - - | 162 |
| శూర్పణఖ శ్రీరాములరూపాతిశయముఁ దెల్పుట - - | 163 |
| మారీచుఁడు శ్రీరామునిప్రభావముఁ దెల్పుట - - | 164 |
| మారీచుఁడు మాయామృగరూపధారియై వచ్చుట - - | 166 |
| మాయామృగము రామునిచేఁ గూలుట - - - | 168 |
| రావణుఁడు భిక్షుకవేషధారియై సీతాదేవియొద్దకేతెంచుట - - | 170 |
| జానకి శోకించుట - - - - | 172 |
| రావణునితో జటాయువు పోరుట - - - | 174 |
| సీత యాభరణముల ఋష్యమూక పర్వతమునఁ బడవేయుట - | 175 |
| జనకజను అశోకవనమునందుంచుట - - - | 176 |
| శ్రీరాముఁడు ఆశ్రమమునకు మరలి వచ్చుట - - | 176 |
| శ్రీరాముఁడు ప్రలాపించుట - - - - | 178 |
| లక్ష్మణుఁడు రాముని శాంతిపఱచుట - - - | 181 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| జటాయువునకు అగ్నిసంస్కారము సేయుట | - | - | 182 |
| కబంధుఁడు రామలక్ష్మణుల నడ్డగించుట | - | - | 183 |
| రామలక్ష్మణులు శబరినిఁ గాంచుట | - | - | 185 |
| శ్రీరాములు ఋశ్యమూకమును జూచి హర్షించుట | - | - | 186 |


## —: కిష్కింధాకాండము :—


| | | | |
|---|---|---|---|
| శ్రీరాములవద్దికి హనుమంతుఁడు వచ్చుట | - | - | 191 |
| హనుమంతుఁడు తనజన్మప్రకార మెఱిఁగించుట | - | - | 193 |
| సుగ్రీవుఁడు జనకజ తొడవు లిచ్చుట | - | - | 195 |
| వాలి మాయావితో యుద్ధముచేయుట | - | - | 197 |
| వాలిదుందుభుల యుద్ధము | - | - | 198 |
| వాలిసుగ్రీవులు పోరుట | - | - | 200 |
| తార సుగ్రీవునితోఁ బోరవద్దని వాలి నడ్డగించుట | - | - | 202 |
| అమోఘాస్త్రముచే వాలి గూలుట | - | - | 204 |
| తార ప్రలాపించుట | - | - | 206 |
| వాలి సుగ్రీవునకు హేమదామ మిచ్చుట | - | - | 208 |
| శ్రీరాములు మాల్యవంతముఁ జేరుట | - | - | 210 |
| లక్ష్మణుఁడు కిష్కింధకుఁ బోవుట | - | - | 213 |
| లక్ష్మణుఁడు సుగ్రీవుని మన్నించుట | - | - | 214 |
| వానరవీరుల సీతను వెదకఁ బంపుట | - | - | 216 |
| శ్రీరాములు హనుమంతునిచేత తనముద్రిక నిచ్చుట | - | - | 218 |
| అంగదాదులు గుహఁ జొచ్చుట | - | - | 220 |
| కపులు స్వయంప్రభను గాంచుట | - | - | 220 |
| కపులు చింతాక్రాంతులగుట | - | - | 221 |
| కపులు ప్రాయోపవేశము చేయుట | - | - | 222 |
| అంగదాదుల సంపాతి చూచుట | - | - | 223 |
| వానరవీరులు తమతమ సత్త్వములఁ దెల్పుట | - | - | 225 |
| జాంబవంతుఁడు హనుమంతునిఁ బ్రార్థించుట | - | - | 226 |
| హనుమంతుఁడు సముద్రమును దాటుట | - | - | 227 |
| హనుమంతునకు మైనాకుఁ డాతిథ్య మొసఁగుట | - | - | 228 |

—: సుందరకాండము :—


| విషయము. | పుట. |
|---|---|
| హనుమంతుఁడు లంకాపురిఁ జొచ్చి సీతను వెదకుట | 231 |
| హనుమంతుఁడు ఉద్యానవనంబుఁ జూచుట | 234 |
| హనుమంతుఁడు సీతను జూచుట | 236 |
| రావణుఁడు సీతాదేవివద్దకు వచ్చుట | 238 |
| జానకి రావణుని దిరస్కరించుట | 239 |
| మండోదరి రావణునికి నీతిఁదెల్పుట | 241 |
| రాక్షసస్త్రీలు సీతను బెదరించుట | 242 |
| త్రిజటాస్వప్నము | 243 |
| రాక్షసస్త్రీల బాధలకు జానకి పలవించుట | 243 |
| హనుమంతుఁడు సీతకుఁ దనజన్మముఁ దెల్పుట | 245 |
| హనుమంతుఁడు సీతతో శ్రీరామ లక్ష్మణుల క్షేమముఁ దెల్పి శిరోరత్నము గొనుట | 247 |
| హనుమంతుఁడు అశోకవనమును జెఱచుట | 249 |
| హనుమంతునిమీఁదికి రక్తరోముఁడు మొదలైనరాక్షసుల రావణుఁడు పంపుట | 251 |
| హనుమంతునిమీఁదికి అక్షకుమారుఁడు వచ్చుట | 253 |
| ఇంద్రజిత్తు తండ్రి నూరార్చి హనుమంతునిపైకిఁ బోవుట | 255 |
| హనుమంతుఁడు రావణునితో తనరాక యెఱింగించుట | 256 |
| హనుమంతుడు లంకఁ గాల్చుట | 259 |
| అంగదాదులు మధువనంబునకు వచ్చుట | 262 |
| హనుమంతుఁడు సీతను జూచినతెఱం గెఱింగించుట | 263 |


—: యుద్ధకాండము :—


| | |
|---|---|
| హనుమంతుఁడు లంకాప్రభావముఁ దెల్పుట | 267 |
| సుగ్రీవుఁడు కపిసేనల వెడలించుట | 269 |
| శ్రీరాములు మహేంద్రాద్రిఁ జేరుట | 270 |
| రావణుఁడు మంత్రులతో నాలోచించుట | 273 |
| రాక్షసాధిపులు రావణునితోఁ బ్రతాపముఁ దెల్పుట | 274 |
| విభీషణుఁడు రావణునియొద్దకుఁ బోవుట | 276 |
| రావణుఁడు కుంభకర్ణునితో రామునిరాకయెఱింగించుట | 278 |
| ఇంద్రజిత్తు విభీషణునికి తనలావెఱింగించుట | 280 |

| విషయము. | | | | పుట. |
|---|---|---|---|---|
| రావణుఁడు విభీషణుని దన్నుట | - | - | - | 283 |
| తల్లియొద్దకు విభీషణుఁడు వచ్చుట | - | - | - | 284 |
| విభీషణ శరణాగతి | - | - | - | 285 |
| రామునకు విభీషణునియోగ్యత నాంజనేయుం డెఱింగించుట | | | - | 286 |
| విభీషణుఁడు శ్రీరామచంద్రు నుతించుట | - | - | - | 287 |
| శ్రీరామచంద్రుఁడు విభీషణు ననుగ్రహించుట | - | - | - | 288 |
| విభీషణుఁడు రామునకు లంకోత్పత్తిని రావణునిబలం బెఱింగించుట | | | - | 288 |
| శ్రీరాముఁడు విభీషణునకు లంకాభిషేకము సేయుట | | - | - | 290 |
| శ్రీరాములు దర్భశయనముసేయుట | - | - | - | 292 |
| శ్రీరాములు సముద్రునిపై బ్రహ్మాస్త్ర మేయుట | | - | - | 294 |
| శ్రీరాములు సుగ్రీవునితో సేతువుగట్ట నాజ్ఞాపించుట | | - | - | 296 |
| చంద్రోదయ వర్ణనము | - | - | - | 298 |
| శ్రీరాములు ఉడుతభక్తిని జూచి సంతసించుట | | - | - | 300 |
| శ్రీరామాదులు సేతువునుజూచి సంతోషించుట | | - | - | 301 |
| శ్రీరాములు సువేలాద్రిఁ జేరుట | - | - | - | 303 |
| కైకేశి రావణునకు హితము సెప్పుట | - | - | - | 305 |
| కైకేశి రావణునకు రామునిమహిమ చెప్పుట | - | - | - | 307 |
| కైకేశి రావణునికి జలప్రళయముఁ దెల్పుట | - | - | - | 308 |
| రావణున కతికాయుఁడు నీతి సెప్పుట | - | - | - | 311 |
| శుకసారణులు శ్రీరాముని కపిసేనఁ జూచుట | - | - | - | 312 |
| రావణునకు శుకసారణులు కపిపుంగవులఁ దెలుపుట | | - | - | 313 |
| శుకుఁడు శ్రీరాముల తేజోవిశేషములఁ దెల్పుట | | - | - | 316 |
| సీతకు శాంబరీమాయచేఁ గల్పితంబైన శ్రీరాముల శిరోధనువులను జూపి వెఱపించుట. | - | - | - | 318 |
| మాల్యవంతుఁడు రావణునితో నీతి సెప్పుట | | - | - | 320 |
| శ్రీరాముఁడు లంకాపుర వైభవముఁ జూచుట | - | - | - | 321 |
| సుగ్రీవుఁడు రావణునితో మల్లయుద్ధముచేయుట | | - | - | 323 |
| శ్రీరాముఁడు వానరులచే లంక ముట్టడి వేయించుట | | - | - | 324 |
| అంగద రాయబారము | - | - | - | 326 |
| రావణుఁ డంగదునితోఁ దనపరాక్రమము సెప్పుట | | - | - | 328 |
| రావణుఁడు తనభటులతో నంగదునిఁ బట్టికట్టుం డని నియమించుట | | | - | 331 |

| విషయము. | పుట. |
| --- | --- |
| రావణుఁడు యుద్ధసన్నద్ధుఁడై యుత్తరగోపురమునకు వచ్చుట - | 332 |
| శ్రీరాములు రావణుని ఛత్త్రచామరంబులు బాణములతోఁ దెగనేయుట - | 334 |
| వానరరాక్షసుల ద్వంద్వయుద్ధము - - - | 337 |
| యుద్ధభూమి వర్ణనము - - - | 339 |
| సాయంకాలాదిరాత్రివర్ణనము - - - | 340 |
| ఇంద్రజిత్తు మాయాయుద్ధముసేయుట - - - | 342 |
| నాగపాశ బంధనము - - - - | 343 |
| నాగపాశబద్ధులైయున్న రామలక్ష్మణులఁజూచి సీత దుఃఖించుట. - | 344 |
| ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధమునకు వచ్చుట - - | 347 |
| నారదుఁడు శ్రీరాములకడకు వచ్చుట - - - | 348 |
| ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట - - - | 351 |
| అకంపనుఁడు యుద్ధమునకు వచ్చుట - - - | 353 |
| మహాకాయుఁడు యుద్ధమునకు వచ్చుట - - - | 355 |
| రాక్షసులతో వానరులు ఘోరయుద్ధము సేయుట - - | 356 |
| మహానాదుఁ డంగదునితోఁ బోరి మడియుట - - | 358 |
| మహాకాయుఁ డంగదునితో మల్లయుద్ధముసేసి మడియుట - - | 360 |
| ప్రహస్తునియుద్ధము - - - | 362 |
| మందోదరి రావణునితో శ్రీరాములపరాక్రమముఁ దెల్పుట - | 364 |
| రావణుఁడు యుద్ధమునకు వెడలుట - - | 366 |
| లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట - - - - | 372 |
| రామరావణుల ప్రథమయుద్ధము - - - | 373 |
| కుంభకర్ణుని నిద్రమేల్కొనజేయుట - - - | 375 |
| విభీషణుఁడు శ్రీరాములతోఁ గుంభకర్ణుని శాపప్రకారము దెలుపుట - | 379 |
| రావణునకుఁ గుంభకర్ణుఁడు నీతి సెప్పుట - - - | 380 |
| రావణుఁడు కుంభకర్ణుని దిరస్కరించుట - - - | 382 |
| కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట - - - | 385 |
| వానరవీరులు కుంభకర్ణునితో యుద్ధము సేయుట - - | 386 |
| సుగ్రీవుఁడు కుంభకర్ణునిచే మూర్ఛనొందుట - - - | 391 |
| సుగ్రీవుఁడు మూర్ఛదేరి కుంభకర్ణుని విరూపునిగాఁజేయుట - | 392 |
| విభీషణుఁడు కుంభకర్ణునికి నీతిఁజెప్పుట - - - | 395 |

| విషయము. | పుట. |
| --- | --- |
| శ్రీరామునిచేఁ గుంభకర్ణుఁడు గూలుట - - - | 396 |
| రావణుఁడు కుంభకర్ణుని మరణమునకు శోకించుట - - | 398 |
| అతికాయ మహోదరులు మొదలగు వీరులు యుద్ధమునకు వెడలుట - | 400 |
| అంగదనరాంతకుల ద్వంద్వయుద్ధము - - - | 402 |
| హనుమంతుడు మొదలగువారలు త్రిశిరాదిరాక్షసవీరులఁ జంపుట - | 404 |
| అతికాయుఁడు యుద్ధముచేయుట - - - | 406 |
| విభీషణుఁడు శ్రీరాముల కతికాయుని ప్రభావముఁ దెలుపుట - | 406 |
| లక్ష్మణాతికాయుల ద్వంద్వయుద్ధము - - - | 409 |
| అతికాయుఁడు లక్ష్మణునిచేఁ జచ్చుట - - - | 410 |
| ఇంద్రజిత్తు రెండవమాఱు యుద్ధమునకు వెడలుట - - | 411 |
| ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రాముఁడు మొదలగువారల మూర్ఛనొందించి మరలుట | 413 |
| హనుమద్విభీషణులు బ్రహ్మాస్త్రము బారిఁబడక సైన్యమును బరీక్షించుట | 414 |
| ఆంజనేయుఁ డోషధీశైలము దెచ్చి రామలక్ష్మణాదుల మూర్ఛదేలించుట. - | 416 |
| వానరులు లంకం గాల్చుట - - - | 418 |
| కుంభనికుంభాదులు యుద్ధమునకు వచ్చుట - - - | 420 |
| కుంభనికుంభులయుద్ధము - - - | 422 |
| మకరాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట - - - | 423 |
| ఇంద్రజిత్తు యుద్ధమున కరుగుట - - - | 425 |
| ఇంద్రజిత్తు హోమముచేసి కృత్తియనుశక్తిఁ బుట్టించికొని మాయాయుద్ధముచేయుట - - - | 426 |
| శ్రీరాముఁ డాగ్నేయాస్త్రముచే నింద్రజిత్తునిమాయ దెరల్చుట - | 428 |
| ఇంద్రజిత్తు హోమముచేసి శస్త్రసమేతముగా రథమును బడయుట - | 430 |
| ఇంద్రజిత్తు మాయాసీతను దెచ్చి తలదరుగుట - - | 432 |
| ఇంద్రజిత్తు నికుంభిళయాగము చేయుట - - - | 434 |
| విభీషణుఁ డింద్రజిత్తునిమాయ శ్రీరాములతోఁ జెప్పుట - - | 436 |
| లక్ష్మణుఁడు యుద్ధమునకు వెడలుట - - - | 438 |
| ఇంద్రజిల్లక్ష్మణుల ద్వంద్వయుద్ధము - - - | 440 |
| లక్ష్మణునిచే నింద్రజిత్తు చచ్చుట - - - | 445 |
| రావణుఁ డింద్రజిత్తు మరణమునకు శోకించుట - - - | 447 |
| రావణుండు సీతను దెగవేయఁ బోవుట - - - | 448 |
| ఇంద్రజిత్తుభార్య సులోచన శోకించుట - | 450 |

| విషయము. | | | | పుట. |
|---|---|---|---|---|
| సులోచన శ్రీరాముల నుతించుట | - | - | - | 451 |
| సులోచన సహగమనముసేయుట | - | - | - | 454 |
| రావణుడు యుద్ధమునకు వెడలుట | - | - | - | 455 |
| మూలబలయుద్ధము | - | - | - | 455 |
| శ్రీరాముఁడు మూలబలముపై మోహనాస్త్రమేయుట | | - | - | 458 |
| రాక్షసస్త్రీలు రావణుని నిందించుట | - | - | - | 459 |
| రావణుఁడు రెండవసారియుద్ధమునకు వెడలుట- | | - | - | 462 |
| సుగ్రీవునిచే విరూపాక్షుఁడు మొదలగు రాక్షసవీరులు చచ్చుట | | | - | 464 |
| రావణుఁడు రామలక్ష్మణులపైఁ గదియుట | - | - | - | 466 |
| రావణునిశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట | - | - | - | 469 |
| రావణుఁడు విభీషణాదులమాట దలంచి చింతించుట | | - | - | 470 |
| లక్ష్మణునిమూర్ఛకు శ్రీరాముఁడు శోకించుట | - | - | - | 472 |
| హనుమంతుఁడు సంజీవకరణికొఱకు ద్రోణాద్రికిఁ బోవుట- | | | - | 474 |
| కాలనేమి వృత్తాంతము | - | - | - | 474 |
| హనుమంతుని మకరి మ్రింగుట | - | - | - | 477 |
| ధాన్యమాలి తనశాపప్రకారము హనుమంతునితోఁ దెల్పుట | | | - | 478 |
| మునివేషధారి యగు కాలనేమిని హనుమంతుఁడు చంపుట - | | | - | 479 |
| హనుమంతునితో మాల్యవంతుఁడు పోరుట | - | - | - | 482 |
| శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి పరితపించుట | | - | - | 484 |
| సుషేణుఁడు సంజీవకరణిచే లక్ష్మణునిమూర్ఛఁ దేర్చుట | | - | - | 486 |
| శుక్రునివద్ద రావణుఁడు శోకించుట | - | - | - | 489 |
| రావణుఁడు పాతాళహోమముసేయుట | - | - | - | 489 |
| అంగదుండు మందోదరిని రావణునియొద్దకు నీడ్చుకొనివచ్చుట | | | - | 492 |
| మందోదరి శ్రీరాములమాహాత్మ్యము రావణునికిఁ దెల్పుట | | | - | 494 |
| రావణుఁడు మూఁడవసారియుద్ధమునకు వెడలుట | | - | - | 495 |
| ఖడ్గరోముఁడు మొదలగురాక్షసులు వానరవీరులతో యుద్ధము సేయుట - | | | | 498 |
| దేవేంద్రుఁడు శ్రీరామునకు రథంబు బంపుట | - | - | - | 500 |
| రావణుఁడు శ్రీరాములపై శూలమువేయుట | - | - | - | 502 |
| శ్రీరాముల కగస్త్య్ లాదిత్యహృదయ ముపదేశించుట | | - | - | 503 |
| రావణుఁడు మూర్ఛిల్లుట | - | - | - | 505 |
| శ్రీరాములు రావణునికరశిరంబులఁదెగనేయుట | | - | - | 508 |

| విషయము. | పుట. |
|---|---|
| రావణునిని కరశిరంబులు మరల మొలచుటకై శ్రీరాములు చింతించుట - | 510 |
| రావణుఁడు బ్రహ్మాస్త్రముచే మడియుట - - - | 512 |
| మందోదరి మొదలగురావణునిభార్యలు శోకించుట - - | 513 |
| మందోదరీవిలాపము - - - - | 515 |
| విభీషణుఁడు మందోదరిని చూచి దుఃఖించుట - - - | 517 |
| రాముఁడు విభీషణు నోదార్చి రావణునకుఁ బ్రేతకృత్యంబులఁ జేయించుట | 517 |
| విభీషణుని లంకాపట్టాభిషేకము - - - - | 518 |
| శ్రీరాములు విభీషణునితో సీతను దెమ్మనుట - - - | 520 |
| సీత యగ్ని చొచ్చుట - - - - | 522 |
| అగ్నిదేవుఁడు సీతను శ్రీరాముల కొప్పగించుట - - | 523 |
| శ్రీరాములు పుష్పకవిమాన మెక్కి యయోధ్యకుం జనుట - - | 527 |
| శ్రీరాములు సీతకు రాక్షసవీరులవిక్రమముఁ దెల్పుట - - | 528 |
| శ్రీరాములు లింగప్రతిష్ఠ సేయుట - - - | 529 |
| శ్రీరాములు సేతుమహిమను దెలుపుట - - - | 532 |
| శ్రీరాముఁడు మార్గమధ్యములోని విశేషములు సీత కెఱిఁగించుట - | 532 |
| శ్రీరాములు భరద్వాజాశ్రమంబునకు వచ్చుట - - - | 534 |
| హనుమంతుఁడు భరతుని జూచుట - - - | 536 |
| భరతుఁడు వసిష్ఠాదిసహితుఁడై శ్రీరాముల నెదురుకొనుట - - | 539 |
| శ్రీరాము లయోధ్యఁ జేరుట - - - - | 541 |
| శ్రీరాముల పట్టాభిషేకము - - - - | 542 |




శ్రీ ర స్తు

# శ్రీ రంగనాథ రామాయణము

## ద్విపదకావ్యము - బాలకాండము

### —: దేవతాస్తుత్యాదికము :—

శ్లో. చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

శ్రీకామినీనాథు జితదైత్యనాథు - లోకరక్షణకృత్యు లోకైకనిత్యు
నిత్యసదానందు నిర్వాణకృత్యుఁ - గృత్యవిదూరు నకృత్రిమాధారు
నాధారకమలమధ్యామోదభేద - సాధనక్రమసమాచరణషట్చరణు
సింధురవరదు నాశ్రితలోకబంధు - బంధమోచను బలిబంధనోదగ్రు
నారూఢపంచదశాక్షరప్రసవ - పారిజాతాకారుఁ బ్రణవానుకారు
నగ్రామ్యగోపికాభ్యంతరవ్యగ్రు - నగ్రసదాకారు నాకారరహితు
యోగిమానసలసదోంకార దీప్తు - యోగసందర్శితాభ్యుదయప్రచారు
శ్రుతిశిరోభాగవిశుద్ధచైతన్యు - నతిలోకు సర్వలోకాశ్రయశ్లోకు
నఖిలాండమౌక్తికాయతనిత్యసూత్రు - నఖిలతత్త్వాతీతు నాద్యంతరహితు
నమలాత్ము నక్షరు నామ్నాయకమల - కమలాప్తు నక్షీణకల్యాణసదను
శంకావినిర్ముక్తసద్భక్తవర్య - కైంకర్యవత్సలుఁ గారుణ్యసింధు
బోధకుండై వచ్చి బోధ్యమై తోఁచి - బోధమై వీక్షించు పూర్ణస్వరూపు
నాదితత్త్వము తత్త్వమస్యాదివాక్య - భేదాతిదూరు, నభేదప్రతాపుఁ
గడుకొని నియతులై కర్మబంధములు - గడచి. యేకతమునఁ గదలక నిలిచి
యరుదుగానింద్రియవ్యాప్తులమఱచి - విరచితాసనబద్ధ విన్యాసలీలఁ

బరిచితాసనమునఁ బదిలమై నిలిచి - సరవితో మదిలోన సరసత నిల్పి
వెలయ డెబ్బదిరెండు వేలనాడులను - గలయ వివేకించి, కసటు వోఁ దుడిచి
యొక రెండుత్రోవల నొకటిగా మెలఁగి - యకలంకమతితోడ నతిసూక్ష్మముగను
నవయవంబులయందు నానందమైన, పవను నిరోధించి, పశ్చిమవీథిఁ
జొనిపి, కోణత్రయశుద్ధి గావించి - మనసుతోడనె కూడ మఱపించి తెచ్చి
కుండలినిజశక్తిఁ గూర్చి, సంప్రీతి - నొండొండఁ గమలంబు లొగి నాఱు గడచి
యటఁ జంద్రమండలం బల్లనఁ జేర్చి - యటఁ బరమవ్యోమమై తన్నుమఱచు
పరమయోగీంద్రులభావమ్ముకీలు - పరికింపఁ దానైన బ్రహ్మస్వరూప
మొగి రెంటఁ బెరయక మూఁటనేర్పడక - తగిలి నాల్గవత్రోవ తత్త్వమైయుండి
యైదింటి కాదియై, యాఱిటిఁ గడచి - యాదికి నాదియై యమరినదేవుఁ
దనుతరనిర్మలాంతర్నాడియూప - మనురూప మగుమనం బాబద్ధపశువు,
నిష్ఠాభిరతి వేది, నిఖిలేంద్రియములు - కాష్ఠము, లోభ మఖండపావకుఁడు
యోగామృతము ఘృత, ముజ్జ్వలానంద - యోగంబు ఫలముగా, నొగిఁ జెల్లుచున్న
యభిమతాంతర్య నిత్యామోదకర్మ - విభవంబు కడపట విలసిల్లు పరముఁ
బరమేశు నవ్యయుఁ బరమకల్యాణుఁ - బరమాత్ము నపరోక్షుఁ బ్రక్షీణకర్ము
మాదేవుఁ గమలాక్షు మన్మేలుదేవు - నాదినారాయణు నఖిలలోకేశు
భావించి కీర్తించి, ప్రార్థించి మ్రొక్కి - సేవించి, యభిమతసిద్ధిఁ గావింప
హారకర్పూర నీహారగోక్షీర - తారకాకృతి శారదాదేవిఁ గొలిచి,
చారురామాయణ చంద్రాబ్ధి యగుచు - వారక విలసిల్లువాల్మీకిఁ దలఁచి,
భారతమంజరీ పారిజాతంబు - సారమానసుఁ బరాశరసూనుఁ దలఁచి,
యతనితనూభవు నాశుకబ్రహ్మ - నతిభక్తియుక్తమై నభినుతిచేసి,
యేకథఁ జెప్పిన నెల్లసజ్జనులు - నేకొని కీర్తులు చేయుచు నుందు;
రేకథఁ జెప్పిన నిహపరోన్నతులు - ప్రాకటంబుగఁ జేర్చి ఫలియించుఁ బ్రీతి;
నేకథఁ జెప్పిన నీప్సితార్థములు - గైకొని పుణ్యముల్ గడఁగి కాన్పించు,
ననువిచారములు నాయంతరంగమునఁ - గొనకొని కృతిసేయఁ గోరుచున్నంత;

## —: గ్రంథరచనకుఁ గారణము :—

శ్రీరమణీయులై సృష్టిసత్తములు - గోరి వర్ణనసేయఁ గోనవంశమున
ఫలితసదాచారభానుఁడై తోఁచి - కలికాలదోషాంధకారంబు ద్రోలి,
గురుధర్మపథముల కొలఁదులు దెలిసి - పరనృపవక్షత్రపంక్తుల నణఁచి,
నిత్యపుణ్యోదయనియతిఁ బెంపొందు - నత్యున్నతప్రతాపాభిరామునకుఁ
గరదీప్తినిజఖడ్గ గంగాప్రవాహ - పరధరణీపాల ఫాలాక్షరములఁ

గలపూర్వగర్వపంకము లొప్పఁగడుగు - నలవుమై నసమానుఁడగు సత్యనిధికి
శరణార్థి రాజన్యషట్పదాధార - కరపద్మునకుఁ గోనకాటభూపతికి,
నయనయోదయదయాయతనిత్యమతికిఁ - బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెంపొందు
రుద్రప్రతాపుండు రుద్రనిర్మలుఁడు - రుద్రాత్ముఁ డగు కోనరుద్ర నరేంద్రు
పౌత్త్రుఁ డభంగుఁ డప్రతిమవిక్రముఁడు - గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు
దివిజేంద్రవిభవుండు ధీరవర్తనుఁడు - భువనవిఖ్యాతుండు బుద్ధభూపాలు
తనుజన్ముఁ డక్షీణదాక్షిణ్యధనుఁడు - ధనధాన్యధనదుండు ధర్మధర్మజుఁడు
అతిపుణ్యసౌజన్యుఁ డరిభీమజన్యుఁ - డతిశౌర్యశరజన్ముఁ డాజన్మశుభుఁడు
కామినీకాముఁ డఖండవిక్రముఁడు - రామత్రయోదారరణవిశారదుఁడు
చందనమందార చంద్రికాహార - కందళత్కుందేందు ఘనకీర్తిధనుఁడు
పరఁగు కోనాన్వయపారిజాతమునఁ - బరిపక్వఫలరీతిఁ బరగినవాఁడు
పొలుచు కోనాన్వయ పూర్వాద్రియందు - వెలుఁగుభానుఁడు వోలె విలసిల్లువాఁడు
దొరసికోనాన్వయదుగ్ధాంబురాశి - బరిపూర్ణచంద్రుఁడై భాసిల్లువాఁడు
నిక్కి యంతంతకు నిర్మలం బగుచు - దిక్కులఁ దనపేర్మి దీపించువాఁడు
దానధర్మక్రియాతాత్పర్యకేళిఁ - దానయై వినుతులఁ దనరారువాఁడు
మగఁటిమి నసమానమహిమదీపింపఁ - బగతుల నవలీల భంజించువాఁడు
బలితోగ్రరాజన్యబలవజ్రపాణి - లలినొప్పువాసవు లలిఁ బోలువాఁడు
ప్రత్యక్షనృపవనపావకోజ్జ్వలుఁడు - సత్యంబుచేతను సరిదగువాఁడు
బలవదుగ్రారాతి బలసముద్రములఁ - గలఁచుచో మంథాద్రిగతిఁ బేర్చువాఁడు
విమలోగ్రరాజన్యవిపులాంధకార - కమలాప్తబింబఖడ్గప్రభావిభవ
విలసితామరవధూ విమలాస్యకమల - ములవీరమధుకరంబులఁ గూర్చువాఁడు
అరినృపప్రాణానిలాహారభుజగ - వరభుజాస్థాపితావనిగలవాఁడు
కురుకేరళావంతికుంతలద్రవిళ - మరుమత్స్యకకరూశమగధపుళింద
సరసుపాండ్యకోసలబర్బరముల - నరనాథసభల వర్ణన కెక్కువాఁడు
అతతసామభేదాదులనొప్పు - నీతిక్రమంబుల నెరసినవాఁడు
రమణమై నాదిమరాజన్యరీతి - నమిత వైభవముల నమరినవాఁడు
వినయనయోపాయ విజయసుస్థిరుఁడు - ఘనకీర్తి విఠ్ఠలక్ష్మాపాలవరుఁడు
రాజసర్వజ్ఞుండు రాజసింహుండు - రాజశిరోమణి రాజపూజితుఁడు
సకలజగద్ధితచాతుర్యధుర్యుఁ - డొకనాఁడు కొలువున నున్నతుం డగుచు,
బహుపురాణజ్ఞులు బహుశాస్త్రవిదులు - బహుకావ్యనాటక ప్రౌఢమానసులు,
హితులు మంత్రులు పురోహితులు నాశ్రితులు - సుతులు రాజులు బహుశ్రుతులును గొల్వ
దీపించి భూలోకదేవేంద్రుపగిది - నేపారియున్నచో నింపు సొంపొంద

రసికులు భారతరామాయణాది - రసగోష్ఠిఁ జెల్లింప రసికశేఖరుఁడు,
రామకథాసుధారసరక్తుఁ డగుచు - నామహాసభలోన నందఱఁ జూచి,
"రమణమైఁ దెనుఁగున రామాయణంబు - క్రమమొప్పఁజెప్పెడి ఘనకావ్యశక్తి
గలకవు లెవ్వారు గల రుర్వి?" ననుచుఁ - దలపోయ విఠలధరణిపాలునకు
నున్నతమూర్తికి నురుయశోనిధికి, విన్నవించిరి వేడ్క విబుధులు గడఁగి
"నీతనూజన్ముండు నిపుణమానసుఁడు - ధూతకల్మషుఁడు బంధురనీతియుతుఁడు
సర్వజ్ఞుఁ డనఘుండు చతురవర్తనుఁడు - సర్వపురాణవిచారతత్పరుఁడు
కమనీయబహుకళాగమవిచక్షణుఁడు - సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతుఁడు
కవిసార్వభౌముండు కవికల్పతరువు - కవిలోకభోజుండు కవిపురందరుఁడు
ప్రత్యర్థిరాజన్యబలవజ్రపాణి - ప్రత్యర్థినృపదావపావకోజ్జ్వలుఁడు
భీకరనిజఖడ్గబింబితస్వర్గ, లోకానురక్తత్రిలోకదుర్గముఁడు
వరసాధుజలజాతవనజాతహితుఁడు - పురుషచింతామణి బుద్ధభూవిభుఁడు
నీ కతిభక్తుండు నిఖిలశబ్దార్థ, పాకజ్ఞుఁ డత్యంత పాండిత్యఘనుఁడు
మఱియు రామాయణమర్మధర్మజ్ఞుఁ - డెఱుఁగునాతని బిల్వ మీకథఁ జెప్ప,"
ననిన మజ్జనకుఁ డుదాత్తవర్తనుఁడు - నను నర్థిఁ బిలిపించి, నను గారవించి,
"భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ - రామాయణంబు పురాణమార్గంబు
తప్పక నాపేరఁ దగ నంధ్రభాషఁ - జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు ముర్వి"
నని యానతిచ్చిన నమ్మృదూక్తులకు - ననయంబు హర్షించి, యట్ల కావింపఁ
బనిపూని, యరిగండభైరవుపేర - ఘనుపేర మీసరగండాంకు పేర
లలితసద్గుణగణాలంకారుపేర - నలఘునిశ్చలదయాయతబుద్ధిపేర
నాతతకృతిపేర నతిపుణ్యుపేర - మాతండ్రివిఠలక్ష్మానాథుపేర
రాజులు బుధులును రసికులు సుకవి - రాజులు గోష్ఠిని రాగిల్లి పొగడఁ
బదము లర్థంబులు భావముల్గతులు - పదశయ్య లర్థసౌభాగ్యము ల్యతులు
రసములకల్పన ల్ప్రాససంగతులు - ననమానరీతులు నన్నియుఁ గలుగ
నాదికవీశ్వరుఁ డైన వాల్మీకి - యాదరంబునఁ బుణ్యు లందఱు మెచ్చఁ
జెప్పిన తెలుఁగున శ్రీరామచరిత - మొప్పఁ జెప్పెదఁ; గథాభ్యుదయ మెట్లనిన:—

## —: కథాప్రారంభము :—

ఘనతపస్స్వాధ్యాయకమనీయశీలు - మునినాథు నారదు మునిలోకవంద్యు
ననఘతపోనిధి యైన వాల్మీకిఁ - గనుఁగొని యొకనాఁడు కర మర్థి నడిగె,
"ఎవ్వఁడు శ్రీమంతుఁ? డెవ్వఁడుశాంతుఁ?-డెవ్వఁడుఘనపుణ్యుఁ? డెవ్వడున్నతుఁడు?
ఎవ్వఁడు నీతిజ్ఞుఁ? డెవ్వఁడుప్రాజ్ఞుఁ? - డెవ్వఁడు దుర్దముం? డెవ్వఁ డుత్తముఁడు?
ఎవ్వఁడుజితకాముఁ? డెవ్వఁడజేయుఁ? - డెవ్వడునిరసూయుఁ? డెవ్వఁడాఢ్యుండు?
ఎవ్వఁడు సువ్రతుం? డెవ్వఁడుదారుఁ? - డెవ్వండుసుచరిత్రుఁ? డెవ్వఁడు సముఁడు?
ఎవ్వనికిన్కకు నింద్రాదిసురలు - దవ్వుదవ్వులనుండి తలఁకుచుండుదురు?
అట్టివాఁడిలఁబుట్టి యరిగెనో? యిప్డు - పుట్టెనో? యిఁకమీఁదఁబుట్టనున్నాఁడొ?"
యనినఁ ద్రిలోకజ్ఞుఁ డైననారదుఁడు - దనబుద్ధినెంతయుఁ దలపోసిచూచి
"యామహి శ్రీవిష్ణుఁ డిపుడు జన్మించె, రాముఁడై దశరథరాజున; కతఁడు
నియతాత్ముఁ, డతిశౌర్యనిధి, కృపాజలధి - జయశాలిస్వజనరక్షణవిచక్షణుఁడు
కంబుకంధరుఁడు చక్కనిమేనివాఁడు - బింబారుణోష్ఠుండు పీనవక్షుండు
పెడదకన్నులవాఁడు విపులాంసతలుఁడు - నిడుదచేతులవాఁడు నియతవర్తనుఁడు
వేదవేదాంగకోవిదుఁడు కోదండ, వేదవిదుండు వివేకభూషణుఁడు
కమలాప్తతేజంబు కడలిగాంభీర్య - మమరాద్రిధైర్యంబు, నవనిసైరణయు,
ధనదునిత్యాగంబుఁ దనయందుమిగులఁ - ననువొందునిత్య కల్యాణవిగ్రహుఁడు,
కౌసల్యకానంద కరుఁడు శ్రీకరుఁడు - భాసురత్రైలోక్యపావనమూర్తి
రాముఁడై యిలఁబుట్టి రాజశేఖరుఁడు - రాము నిమ్మని వేఁడ రాజు పంపఁగను,
మౌనివెంటను పోయి, మఖమునుగాచి - దానవి నటు కూల్చి దైత్యుని ద్రుంచి,
రాతి నాతిని జేసి, రాముఁడు వేగ - సీతఁ జేకొనుటకు శివువిల్లు విఱిచి,
ఖ్యాతిగా సీతను గడుఁ బెండ్లియాడి - సీతతోడనుగూడి, చెలఁగియయోధ్య
కేతెంచుచోటను గెరలుచు విప్రుఁ - డేతెంచి, నిలిచిన నేపునఁ గదిసి,
వాపోవ నాతని బలువిల్లు దిగిచి - కోపంబుతో మునుఁ గొమరొప్పఁదీసి,
యేపున నందఱు నెద వేడ్కమీఱ - నాపట్టుననెవచ్చి యప్పురిఁజేరి,
"యాసక్తియౌవరాజ్యాభిషిక్తునిగఁ - జేసెద" నని తండ్రి చెలఁగి యయోధ్యఁ
బట్టంబు గట్ట భూపతి సమకట్ట - మట్టుమీఱినయట్టి మంథర యపుడు
నెట్టనఁ గైకతో నెఱినాటఁ జెప్పఁ - గట్టడికై కసంగరమునఁ దొల్లి
రెండువరంబు లర్థించినదొటఁ - జండించి, కాననస్థలికి రాఘవునిఁ
బనిచిన, జనకునిప్రతినకై పూని - జనకజాలక్ష్మణసహితుఁడై వెడలి,
దేవనంబునను నెంతేవనంబునను - బావనమునిచర్యఁ బరఁగుసంయములఁ

గరుణమైఁ గాపాడి ఖరదూషణాది - శిరములు శరములఁ జెండుచెండాడి,
ఋశ్యమూకంబున నినజుఁ జేపట్టి, వశ్యత నొకకోల వాలిఁ దూలించి,
సీతకై చలపట్టి సేతువుగట్టి - పాతకదశకంఠుపదితల ల్గొట్టి,
సీతతోఁ గూడి, యాశ్రితలోకపారి-జాతంబు వనచరజాతంబు గొలువ,
నింద్రాదివినుతుఁడై యేతెంచి, రామ-చంద్రుండు నిజపూజ్యసామ్రాజ్యలక్ష్మిఁ
బాలించుచున్నాఁడు; ప్రజలకువేడ్క - గీలించుచును గృతకృత్యుఁడై "యనుచు
నారామచరిత మాద్యంతంబు చెప్పి - నారదముని పోయె నలినజుపురికిఁ;
మునిపతివాల్మీకిముదమొప్ప నంతఁ - దనశిష్యుఁ డగుభరద్వాజుండు దాను
బ్రకటింప సజ్జనభావంబుపోలె - నకలుషజీవనం బైకరం బలరు
తమసానదికిఁ బోయి, తన్నదీవారిఁ - దమయనుష్ఠానము ల్దగఁ జేయుచుండి,
యామేటిదరిఁగ్రౌంచయమళంబుప్రేమ - గాయజకేళిమైఁగవయుచో, నొకటి
నొకబోయచంపిన, నున్నయాక్రౌంచి - ప్రకటశోకంబునఁ బలవింపఁజూచి,
దగవును ధర్మంబు తలపోసి మౌని - పగదాయ నబ్బోయపై నల్క వొడము.
"యోరినిషాదుండ! యోరిపాపాత్మ! - యోరి! నీకెగ్గేమి యొనరించె? రోరి!
కామించి క్రౌంచముల్ గవయుచో నొకటి - నేమిటికై చంపి తిబ్బంగిఁ గదిసి?
యీపాతకమున ననేకదుఃఖములు - ప్రాపించి తిరుగుము బహువత్సరములు"
అనిబోయ శపియించి, యంత వాల్మీకి - దనశిష్యుఁ డగు భరద్వాజునిఁజూచి,
పలికెను శ్లోకంబుపద్ధతిగాను - "బలికినపల్కును బలుమాఱుచూడ
ఛందోనిబద్ధమై సమవర్ణపంక్తిఁ - బొంది నాలుగుపదంబుల హృద్య మగుచు
నిది చాలవిస్మయ మీశాపవాక్య - పదములు దమయంతఁ బద్యమై నిలిచె."
ననిన భరద్వాజుఁ డాదిగాశిష్య - లనురక్తిఁ బఠియించి రాపద్యమంత;
ననఘుఁ డా వాల్మీకి యాశ్రమంబునకుఁ - జనియున్నచో బ్రహ్మ చనుదెంచుటయును
నెదురేగి పదముల కెరఁగి తోడ్తెచ్చి - కుదురుగాఁ గుశపీఠిఁ గూర్చుండఁజేసి,
కరమర్థిఁ బూజించి, కరములు మొగిచి - పరఁగ శాపాక్షరపద్యంబుఁ జదువ
విని, బ్రహ్మ నగి, "పద్యవిషయమై వాణి - యనఘ! నీముఖమున నవతరించినది;
శ్రీరామచరిత మశేషంబు నాకుఁ - గోరి నారదుఁడు సంకోచించి చెప్పె.
నదివిస్తరించి నీ వఖిలంబుచెప్పు - నది; సర్వమును దోఁచు"నని చెప్పి పోయె.
నీరీతిఁ గృప వరం బిచ్చి మన్నించి - సారసగర్భుండు సనినపిమ్మటను,
మఱి నిర్మల ధ్యానమతిఁ బూని మౌని - తఱిగొని సకలంబుఁ దలపోసిచూచి,
రఘుచరిత్రము, దశరథుచరిత్రంబు - రఘురామజన్మంబు, రామువర్తనము,
తాటకవధయు, నుద్దండరాక్షసుల - యాటోపహరణంబు, యజ్ఞరక్షణము,
దనరుగంగామహత్త్వంబు, గౌతముని - వనితను శాపంబువలనఁ బాపుటయు,

ధనువు ద్రుంచుటయు, సీతావివాహంబు - చనుచోటజమదగ్నిజాతునాగ్రహము,
రామాభిషేకసంరంభంబు, దుష్ట - కామిని కైకేయికష్టభాషణము,
నభిషేకవిఘ్నంబు, నడవికి రామ - విభుఁడు వోవుటయు, భూవిభునిశోకంబు,
దశరథుమరణంబు, దశరథరాముఁ - గుశలసంభాషియై గుహుఁడు గాంచుటయు,
నురుపుణ్యు లట గంగ నుత్తరించుటయు - వరతపోనిధి, భరద్వాజు గాంచుటయు,
నరిగి, యాచిత్రకూటాద్రి నెక్కుటయు - భరతుండు రఘురాముపజ్జఁ జేరుటయు,
నన్నచేఁ బాదుక లర్థిమైఁ బడసి - మన్నన లింపార మగుడి వచ్చుటయు,
దండకాగమనంబు, తగిలి విరాధుఁ - జండవిక్రము నందు సంహరించుటయుఁ,
బరమపుణ్యునిశరభంగుఁగాంచుటయుఁ - బరువడి మునులతోఁ బ్రతినలాడుటయు,
చని యయ్యగస్త్యునాశ్రమము చొచ్చుటయు - మునిచేత దివ్యాస్త్రములు వడయుటయు,
మునిచెప్పఁగా వారు ముదమున వేగ - చని పర్ణశాలలో సరగనుండుటయు,
మోహించి రాక్షసి మొనసి వచ్చుటయు - నూహించి దానితో నొగిఁ బల్కుటయును,
స్రుక్కఁర రామానుజుండు శూర్పణఖ - ముక్కును, చెవులును మ్రోడుసేయుటయు
నదివోయి ఖరదూషణాదిరక్కసుల - కదిచెప్ప వారంత నలిగి వచ్చుటయు,
నురువడి రఘురాముఁ డొక్కఁడే కడఁగి - ఖరదూషణాదుల ఖండించుటయును,
నట రావణునిబుద్ధి నలుకవుట్టుటయుఁ - గుటిలమారీచుండు క్రొవ్విచచ్చుటయు,
నసురాధిపతి సీత నపహరించుటయు - విసువక రాముఁడు విలపించుటయునుఁ,
నని జటాయువుచావు నవలఁ గబన్ధుఁ - గనుటయు, మఱి పంపకడకుఁ బోవుటయుఁ,
గరమర్థి ఋశ్యమూకమున సుగ్రీవుఁ - దరుదెంచి కనుటయు, నతనిసఖ్యంబు
వాలిసుగ్రీవులవైరంబు తెలఁగు - చాలంగ రాముండు సప్తతాళముల
నేలఁ గూలఁగనేసి నెమ్మి మెప్పించి - వాలి నొక్కమ్మున వధియించుటయును,
దారావిలాపంబు దశరథసూనుఁ - డారవిసూను రాజ్యమున నిల్పుటయు,
మానవపతియంత మాల్యవంతమున - వానకాలం బెల్ల వసియించుటయు,
గాకుత్స్థుకోపంబు కపిసమాగమము - నేకతంబున ముద్రి కిచ్చిపుచ్చుటయు,
వలయక కపులు సీతాన్వేషణంబు - సలుపుటయును, బిలసందర్శనంబు
నాక్షణంబున మహేంద్రాద్రి నెక్కుటయుఁ - బక్షీంద్రుఁడైన సంపాతిదర్శనము,
వనధిలంఘనమున వనధిమధ్యమునఁ - జనుచోట మైనాకసందర్శనంబు,
మదమెత్తి సింహిక మారుతసూనుఁ - గదిసి చచ్చుటయు, లంకాప్రవేశంబు,
లంకను నొప్పించి అలనచే నచట - లంకత్రోవయుఁ గని లంకఁ జొచ్చుటయు,
నంతఃపురంబున కరిగి చూచుటయు, - నంత నశోకవనావలోకనముఁ,
దెఱగొప్ప నందు వైదేహిఁగాంచుటయు, - నెఱుకకు నానవాలిచ్చి దేర్చుటయు,
బెనచి యావనమెల్లఁ బెఱికివైచుటయు, - హనుమంతుఁ డత్తఱి నక్షుఁజంపుటయు,

బవనజుఁ డటఁ బట్టువడి పోవుటయును, గవిసి లంకాపురి గలయఁగాల్చుటయు,
మానినీమణిశిరోమణి నిచ్చుటయును - మానితాత్ముం డబ్ధి మరలదాఁటుటయు,
మధువనహరణంబు, మణిప్రీతినిచ్చి - యధిపతి మారుతి నాశ్వసించుటయు,
వినకులాధిపుఁడు దండెత్తిపోవుటయు, - వనధితీరంబున వచ్చి నిల్చుటయు,
వనధాశి త్రోవ యివ్వక క్రొవ్వుటయును - గొనకొని రాముండు గోపించుటయును,
నంతవిభీషణుఁ డధిపుఁ గాంచుటయుఁ - జింతించుటయు మఱి సేతుబంధనము,
జడధిదాఁటుటయును, జనిలంకమీఁద - విడిసిపేర్చుటయు, దోర్వీర్యంబు మెఱసి
కర ముగ్రులగుకుంభకర్ణాదివీర - వరులఁ ద్రుంచుటయు రావణునిఁ జంపుటయు,
నావిభీషణుని లంకాధినాయకునిఁ - గావించి పట్టంబు కరుణఁ గట్టుటయు,
ననుపమశుద్ధిబ్రహ్మాదుల మెచ్చ - జనకజ రఘురామచంద్రుఁ బొందుటయు,
నెలమిఁ బుష్పక మెక్కి యెల్లరువేడ్కఁ - జెలఁగి యంభోనిధి సేతువుమీఁదఁ
దెలిసి శ్రీకంఠుఁ బ్రతిష్ఠసేయుటయు, - వెలయ నయోధ్యకు వేగవచ్చుటయు,
భరతుగాంచుటయును, బట్టాభిషేక - మరుదుగా రఘురాముఁ డవధరించుటయు,
గపిసైన్యపతుల నర్కజవిభీషణుల - విపులసంపద లిచ్చి వీడుకొల్పుటయుఁ,
బరికించి ప్రజలకాపదలొందకుండఁ - గరుణఁబ్రోచుట, యనుకథలెల్లఁ దెలిసి
వెలయ నిర్వదినాల్గువేలశ్లోకములు - గలిగి, యేనూఱుసర్గల విస్తరిల్లి
కాండంబు లాఱింటఁ గరమొప్పమిగిలి - యుండ, రామాయణ మొప్పఁగావించి
యొనరఁ దక్కినకథ లుత్తరకాండ - మునఁ జెప్పి, వాల్మీకిమునినాథుఁ డంత
ఈకథ పఠియింప నెవ్వరు నేర్తు - రీకథ జగముల నెబ్బంగి వెలయు,
ననుచుండ కుశలవు లనఘమానసులు - మనసిజాకారులు మంజుభాషణులు,
జననుతుల్ సంగీతసాహిత్యపరులు - మునివేషధారు లిమ్ములవచ్చి మ్రొక్కి,
"యనఘ ! రామాయణంబర్థితోఁజదువ-జనుదెంచితిమి మమ్ముఁజదివింపవలయు."
ననిన సంతోషించి యమ్మునీశ్వరుఁడు - "తనమనోరథమెల్లఁదలకూడె" ననుచు
గేయమై పాఠ్యమై కేవలపుణ్య, దాయకం బగు రఘూత్తమచరిత్రంబు
ననుపమతంత్రీలయాన్వితఫణితి - మునిపతి చదివింప ముదమొప్పఁ జదివి,
రమణశృంగారాదిరసములేర్పడఁగ - సమవృత్తిభేదముల్ సంధి సమాస
సమధికశబ్దార్థసంగతు లెఱిఁగి - క్రమమొప్పఁ బాడుచుఁ గవగూడి వారు
మునిజనసభల నిమ్ములఁబూజనములు - గొని, వినోదింపఁ గాకుత్స్థవల్లభుఁడు
వెలయుఁ దమ్ములు దాను వేడ్కలింపొందఁ - గొలువిచ్చి వారలఁ గోరి రావించి
వారిరూపంబులు వారినిల్కడలు - వారినిర్మలతరవాగ్విశేషములు,
తనకు నింపొనరింపఁ దత్కథాక్రమము - వినుచుండె రాముఁడవ్విధమెట్టిదనిన:—

## —:కుశలవులు శ్రీమద్రామాయణ కథను గానము చేయుట:—

ద్వాదశయోజనాత్యాయతం బగుచు - నైదుయోజనముల నడివెడల్పగుచు
నిపుణత మయునిచే నిర్మితంబగుచు - నెపుడుశాత్రవకోటి కెదురుచుక్కగుచు
కొలఁదిమీఱినభానుకులజులకెల్ల - కులరాజధానియై కొనియాడఁ బరఁగి
సరయువుపొంత కోసలదేశమునను - ధరణికిఁ దొడ వయోధ్యాపురంబొప్పు;
మణిగోపురంబుల మణితోరణముల - మణికుట్టిమంబుల మణిగవాక్షములఁ
గేళికాగృహములఁ గృతకశైలముల - బాలానిలంబులఁ బటహనాదముల
మహితవారణముల మానితాశ్వముల - బహురథప్రతతుల భటకదంబముల
విమలసౌధంబుల విపణిమార్గములఁ - గమనీయవనములఁ గమలాకరములఁ
జెఱువుల బావులఁ జెఱకుదోఁటలను - దఱుచైన శాలికేదారవారములఁ
బరిఘలఁ గోటలఁ బసిఁడిమాడువులఁ - గరమొప్ప లోకవిఖ్యాతమై పరఁగు.
నాపురి దశరథుం డను మహారాజు - చాపవిద్యావరజాలకార్ముకుఁడు
చతురుపాయజ్ఞుండు షాడ్గుణ్యశాలి - సతతశక్తిత్రయసంధానకర్త
ధర్మోత్తరుఁడు కృతాధ్వరుఁడు శ్రీకరుఁడు - ధర్మశాస్త్రపురాణతాత్పర్యపరుఁడు
అజునినందనుఁడు బాల్యాదిగా నియతిఁ - బ్రజలపాలించిన పరమపావనుఁడు
జంభారికై పోయి శంబరాసురుని, దంభం బణంచి సుత్రామునిచేత
మందారపుష్పదామములు గైకొన్న - యిందుమతీపుత్త్రుఁ డినకులాధిపుఁడు
తేజంబు కాంతియుఁ దెగువయు నేర్పు - రాజసంబును నుదారతయు ధైర్యంబు
మొదలైనసద్గుణంబులప్రోదియగుచు - నుదయార్కుఁగతిఁదనయుగ్ర తేజంబు
దీపితంబై యేడుదీవులఁ బర్వ - భూపాలతిలకమై పొలుపొంద నేలు.
నన్నరనాథుకులాంగనామణులు - మున్నూటయేబండ్రు ముఖ్యలై యందు
నచలతసౌశీల్యమైన కౌసల్య - కుచకుంభనిర్జితకోక యాకైక
యనఘచరిత్రయౌనాసుమిత్రయును - వినుతికెక్కిరి త్రయీవిద్యలోయనఁగ.
నిలమీఁదనతనికి హితపురోహితులు - పొలుచువసిష్ఠాదిపుణ్యసంయములు
అనఘాత్మకుఁడు దృష్టి యనువాఁడువిజయుఁ - డనువాఁడు సిద్ధార్థుఁ డనువాఁడు మఱియు
నర్థసాధకుఁడు జయంతుఁడు నీతి - తీర్థుఁ డశోకుండు ధీమంతుఁడైన
మంత్రపాలకుఁడు సుమంత్రుండు ననఁగ - మంత్రులుగల రెనమండ్రు నాతనికి.
నామంత్రు లందఱు నన్యోన్యహితులు - స్వామికార్యవిచారచతురమానసులు
పరమర్మభేదనోపాయధౌరేయు - లరసి ప్రజారక్ష యాచరింపుదురు.
అట్టివా రెనమండ్రు నఖిలకార్యములఁ - బట్టున దిద్దఁదీర్పను జాలికొలువ
నష్టాక్షరముల బాహాష్టకంబులను - స్రష్టయై వెలయు నారాయణుకరణి

దశరథుండలరె, నాతనిదేశమునను - గృశుఁడు కొండీఁడు రోగియు దరిద్రుండు
జారుండు మఱి యనాచారుండు పుణ్య - దూరుండు క్రూరుండు తుచ్ఛుండు జడుఁడు
మందుండు మఱిలేరు మందునకైన; - నందఱు మణికుండలాద్యలంకృతులు
నందఱు ధర్మపరాయణచిత్తు - లందఱు విహితకులాచారరతులు
అందఱు సకలశాస్త్రాబ్ధిపారగులు - నందఱు శ్రీవిష్ణునతిభక్తిపరులు.
ఈచందమున రాజ్య మేపు దీపింప - భూచక్ర మెల్ల నేర్పున నేలియేలి
ప్రకటరాజ్యాంగసంపదఁ దేలితేలి, యొకనాఁడు దశరథుం డుల్లంబులోనఁ

—:మంత్రులతో దశరథుఁడు పుత్త్రకామేష్టిసేయుట కాలోచించుట:—

దనకు సంతతిలేమిఁ దలపోసి వగచి - తనకు నాయువు వేగ తగఁబోయె ననుచు
మనమునఁగుందుచు మఱియునాతండు - తనమంత్రివరుల నందఱను రప్పించి
ఘనముగఁగొలువిచ్చి ఘనతఁగూర్చుండి - తనమంత్రివరుల నందఱఁజూచి పలికెఁ
"పెక్కుదానంబులు పెక్కుధర్మములు - పెక్కుయాగంబులు పెక్కువఁజేసి
పెక్కేండ్లు మంటి; శోభితకీర్తిఁగంటి; - మక్కువ మీవంటిమంత్రులు గలుగఁ
గొదువలేదేమిటఁ; గొడుకులులేని, కొదువ యొక్కటిగాని, కులముద్ధరించు
కొడుకులులేకున్నఁ గోరిపుణ్యములు - వడయ రుత్తమలోకపదవు లెవ్వరును,
గానఁ బుత్త్రులఁగానఁగా నాకువలయుఁ - గాన నేనింక లోకము లెల్లమెచ్చఁ
దలకొని యశ్వమేధముసేసి, పిదప - నెలమితోఁ బుత్త్రకామేష్టి ప్రేల్చెదను.
ఈయాగములచేత హితము రంజిల్లఁ బాయకపుత్త్రులఁ బడసెదనేను."
ననిచెప్ప వారలు నతిసంభ్రమమున - మనమున సంతోషమగ్నులై యున్న
నామంత్రివర్యుల నందఱఁ జూచి - తా మఱి నూహించి తగవొప్పఁ బలికె
"ననుపమంబుగ నేను నశ్వమేధంబు - వినయంబునంజేసి విబుధులు మెచ్చఁ
బుత్త్రులకొఱకునై పుత్త్రకామేష్టి - నేత్రోత్సవంబుగ నేఁజేయువాఁడ."
నని తగుపనులకు నందఱఁ బనుప - ననఘులు మఱి వసిష్ఠాదులు వచ్చి
నిలిచిన మ్రొక్కుచు నెలమిఁ దోడ్తెచ్చి - పలికెను వారితోఁ బార్థివోత్తముఁడు.
"అనఘవసిష్ఠసంయములార! యిపుడు - ఘనమైనహయమేధకంబు నాచేత
జేయించి పుత్త్రైకసిద్ధినొందుటకుఁ - జేయింపుఁడీ దానిఁ జెచ్చెర"నన్న
నలవడ నీచేయు హయమేధమఖము - నెలకొని యేమింక నిర్వహించెదము.
మది నెన్నశక్యమే మఖరాజమహిమ? - యిదిగాక పుత్త్రకామేష్టియుఁ జేయఁ
దనయులఁ గాంచెదు ధన్యమానసుల" - ననవుడు హర్షించి యవనినాయకుఁడు
అందఱఁ బనిచి శుద్ధాంతంబుసొచ్చి - సుందరీమణుల కాశుభవార్తఁ జెప్పి.
యనురక్తి నేకాంతమైయున్న వేళ - ననఘుండు సూతుఁ డిట్లనియె భూపతికి:—

## —: ఋశ్యశృంగ వృత్తాంతము :—

"ధరణీశ! మీకు సంతానసంప్రాప్తి - వెరవైనకథ మున్ను విన్నాఁడ నేను;
భూమీశ! విను మంగ భూమీశుకొడుకు - రోమపాదుఁడు గుణారూఢుండు దొల్లి
యేమిపాపముననో యెఱుఁగఁజొప్పడక - యామహిలోవర్షమటు కుర్వదయ్యె..
దా నేలి పాలించు ధరణిపై నెందు - వానలు లేకున్న వగలను జెంది,
వరమునీంద్రులచేత వర్షహోమములు - పరువడి సేయించి, పడయరాకున్న
ఘూరిశోకంబునఁ బొగలుచునున్న - యారాజుఁ గనుఁగొని యమ్మును లనిరి,
"యోమహీపాలక! యోరాజచంద్ర! - యీమహిపై వానలిటఁ బర్వుటకును
నొకయుపాయమ్ము మే మొగిఁ జెప్పువార; - మకలంకమతితోడ ననువొందఁజేయు;
పరహితోన్నతుఁడు విభాండకసుతుఁడు - చిరపుణ్యనిధి ఋశ్యశృంగుఁ డన్వాఁడు
నగధైర్య! పుట్టిననాఁటనుండియును - నగరరాష్ట్రంబు లెన్నఁడు నెఱుంగమిని
నతఁ డెందు నాఁడువా రను పేరునెఱుఁగ;-డతఁడు తాపసవృత్తి నడవులనుండు;
వసుధేశ! యతఁడిందు వచ్చినఁ జాలు; - వెసఁబాయు నీయనావృష్టిదోషంబు."
నావుడు మునినాథు నగరి కేరీతి - రావింతు నని విచారముచేసి తెలిసి
అతఁడు వచ్చుటకును నాత్మఁజింతించి - మతిమంతు లగునట్టి మంత్రులఁ బిలిచి
మునులను రప్పించి ముదమొప్ప నడుగ - మునులును మంత్రులు ముదముతోఁ జెప్ప,
మనమున సంతోషమహిమ శోభిల్ల, మునులమాటలు విని మోదంబుమీఱ
మండెను భూకాంతుఁ; డొగి మౌనులనిరి, దండిగ నోరాజ! తలపోసి యిపుడు
వారకాంతలనెల్ల వసుధేశ! పంపు; - వారకాంతలచేత వనముల కిపుడు
దండిగాభక్ష్యముల్ దగవారికిచ్చి - మెండుగ వనముల మేటివస్తువులు
పెట్టి పంపుము నీవు పెంపుతో ననుచు - గట్టిగాఁ గాంతలు కడుప్రౌఢసతులు
తిన్నగనటుపోయి తెఱఁగొప్పఁగాంచి, మన్ననచే మౌనిమహిమ వీక్షించి,
తియ్యనిభక్ష్యముల్ తెఱఁగొప్ప నిచ్చి - నెయ్యంబుచే మది నెఱిఁ గరఁగించి,
యాటలఁబాటలఁ దేటమాటలను - బాటలగంధులు పదిలులై నిలిచి
మనసెల్లఁగరఁగించి, మఱివెంట నంటి - మనసిజాకారలు మఱి మాయవన్ని
యచ్చుగ నిటురాఁగ, నతడు వెన్దగిలి - వచ్చును; నిందుకు వసుధేశ! వినుము."
అనిచెప్పి మునివర్యు లటచనిరంత - ఘనముగా నారాజు కరుణ నారాత్రి
మనమలరగ నుండి, మఱునాఁడులేచి - మునులను దలఁచుచు ముదమొప్ప నంత
ననురక్తిఁ గడుఁబ్రౌఢ లగు వారసతుల - వినుతయౌవనరూప విభ్రమవతుల
మనసిజు మోహనమంత్ర దేవతలఁ - బనిచె నొప్పెడువారిఁ బాటించి యతఁడు.
అతివ లమ్మునియున్న యడవికిఁ బోయి - యతని యాశ్రమభూమి కల్లనఁజేరి.

